Registered No. M-4345.

# యుద్ధ సంచిక.

వాల్యూం I.] మద్రాసు : 1941 వ సం॥ జూలై నెల 18 వ తేది శుక్రవారం [నె 18 రు

## ఈ వారంలో యుద్ధ వార్తలు.

### విమానదాడులు.

9 వ తేది రాత్రి బ్రిటిషు విమానములు, జర్మనీ సరిహద్దునందలి సుప్రసిద్ధ పారిశ్రామిక పట్టణమగు "యేచిన్" పైన తీవ్రమగు దాడిని సాగించెను. అచటి ఫాక్టరీలలో నూటికి 90 వంతులు ధ్వంసమొనర్పబడెను. దానితోబాటు ఓస్టెండు, మన్‌స్టరు మొదలగు పట్టణముల పైనగూడ దాడులు సాగింపబడెను. గురువారము రాత్రి బ్రిటిషు విమానములు, ఫ్రెంచికోస్తా పట్టణముల పైన చాలగంటల సేపు అతిభయంకరమగు దాడిని సాగించెను. ఆ పట్టణములలో లేచిన పెద్ద పెద్ద మంటలను చూచి, భయంకరమగు ప్రేలుడు శబ్దములను విని, బ్రిటిషు కోస్తా పట్టణములలోని ప్రజలు నిద్రనుండి లేచి తమపట్టణము మీదనే దాడులు జరుగుచున్నవని భ్రమించి రక్షణగృహములలోనికి వెళ్లి దాగుకొనిరి. వీనితోబాటురైను ప్రాంతపు పారిశ్రామిక పట్టణముల మీదను, ఫ్రాన్సునందుత్తరభాగపు పట్టణముల పైనకూడ బాంబులు వర్షింపబడెను. బ్రిటిషు విమానములిపుడు క్రొత్త రకపు ఫిరంగులనుపయోగించుచున్నవి. వాటిగుండ్లు తగిలినతోడనే శత్రు విమానములు శిథిలమై నేలగూలుచున్నవి. ఇట్టి ఫిరంగులతోడను వేలకొలది టన్నుల బాంబుల తోడను బ్రిటిషు విమానములు గత శుక్రవారము రాత్రి, జర్మను యుద్ధ నౌకా కేంద్రమగు విల్‌హెల్మ్సుహేవెన్ పట్టణముపైన చురుకైన దాడిని జరిపెను. శనివారము ఉదయము ఫ్రాన్సు ఉత్తర భాగము పైనగూడ వందల కొలది బ్రిటిషు విమానములు స్వేచ్ఛగా విహరించి అగ్ని గోళములను వర్షించినవి. శనివారము రాత్రి, జర్మను పారిశ్రామిక పట్టణమగు బ్రెమెన్ నగరముపై దారుణమగు దాడి జరుపబడెను. ఆదివారము రాత్రి రాయలు విమానదళము జర్మనీ వాయవ్య భాగమునగల పారిశ్రామిక పట్టణములపైన మరల బ్రహ్మాండమగు దాడి సాగించెను. ఆస్టెండు, రాటర్డాం మొదలగు పట్టణములలోని రేవులును, గిడ్డంగులును ధ్వంసము గావింపబడెను. 14 వ తేదిన ఫ్రెంచి తీరములోని చెర్బర్గు రేవుపైనను, జర్మనీలోని పారిశ్రామిక నగరములగు బ్రెమెన్ పైనను హానోవరు పైనను పెద్ద దాడులు జరుపబడెను. చెర్బర్గులో 6,000 టన్నుల పెద్ద నౌక యొకటియు, చాల చిన్న నౌకలును బాంబులచే ధ్వంసమొనర్పబడెను. లీహావే రేవునందు 6,000 టన్నుల నౌక యొకటి బాంబులచే ముంచి వేయబడెను.

8 వ తేదీ బుధవారము రాత్రి శత్రువిమానములు, బ్రిటనులో సముద్రతీర ప్రాంతముమీదనే అధికముగ దాడులు సాగించెను. చాలతక్కువ విమానములు మాత్రమే లోనికి చొచ్చుకొని రాగలిగెను. ఈ దాడులలో నాల్గు శత్రువిమానములు పడగొట్టబడెను. గురువారము రాత్రి కొంచెము సేపేయైనను, శత్రువిమానాలు చాల తీవ్రమైన దాడి సాగించెను. కొంత నష్టము కలిగినది. ఆ దాడులలో 16 జర్మను విమానములు నిర్మూలింపబడెను. శనివారము మధ్యాహ్నము కొన్ని విమానములు ఇంగ్లండు పశ్చిమ ప్రాంతమున బాంబులు వేసెను. వానివలన స్వల్పముగ జననష్టముగూడ కలిగినది. 13 వ తేదీ రాత్రి కొన్ని శత్రువిమానములు, మిడ్లండ్సు పైకి వచ్చి బాంబులు వేసెను. కొలదిమంది మరణించిరి. కాని విస్తారమగు నష్టము కలుగలేదు. ఒక చోట జర్మను విమానము చాల క్రిందుగా ఎగురుచు మెషిన్‌గన్‌తో, ఒక రైలు బండిపై చాల గుండ్లను వర్షించెను. ప్రయాణికులలో 3 గ్గురు మరణించిరి. రెండు శత్రువిమానములు పడగొట్టబడెను.

సోమవారమునాడు గూడ కోస్తా పట్టణములపై స్వల్పముగ దాడులు జరిగెను. కాని నష్టమెక్కువ లేదు. మంగళవారమునాడు బ్రిటనులో నెక్కడను బాంబులు పడనేలేదు.

జూన్ మాసమున విమానదాడులవలన బ్రిటనులో 399 మంది మరణించిరి. 461 మందికి గాయములు తగిలెను.

12 వ తేదితో ముగిసిన వారమున బ్రిటనుపైకివచ్చిన 23 జర్మను విమానములు పడగొట్టబడెను. జర్మనీ, ఫ్రాన్సులపై దాడులలో 135 జర్మను విమానములు ధ్వంసమొనర్పబడెను. బ్రిటిషు విమానములు 96 నష్టమయ్యెను.

### ఆఫ్రికా—మధ్యధరా.

సైప్రెస్ దీవిపై శత్రులు విమానదాడుల నీ వారము అధికమొనర్చిరి. 9 వ తేదిన ఆదీవికి సమీపముగ పోవుచున్న నౌకలపై బాంబులువేసిరిగాని, నౌకలలో దేనికిని ప్రమాదము కలుగలేదు. 12 వ తేదిన సైప్రెస్ తూర్పు భాగమునగల ఫమగుస్టా పట్టణముపై బాంబులవేసి కొంతనష్టముగలిగించిరి.

10 వ తేది రాత్రి మాల్టా దీవిపైనగూడ బాంబులు పడెను. కొందరు మరణించిరి. ప్రజల ఆస్తికి నష్టము కలిగెను. కాని సైనిక శిబిరముల కెట్టి నష్టమును కలుగలేదు.

12 వ తేదిన సూయజుకాలువ ప్రాంతముమీద గూడ శత్రు విమానములు దాడి సల్పెను వాని బాంబులవలన 6 గురు మనుష్యులు మరణించిరి. కొంతనష్టముగలిగెను. 14 వ తేదిన సూయజు ప్రాంతముమీద అలెగ్జాండ్రియా రేవుమీద మరల శత్రువిమానములు బాంబులు వేసెను. వానివల్ల ఒక మనిషి మరణించెను. ఆస్తికి కొంత నష్టము కలిగెను.

బ్రిటిషు విమానములు 10 వ తేదిన, లిబియా (ఉత్తర ఆఫ్రికా) యందలి బెంఘాజీ, ట్రిపోలీ రేవు పట్టణములపైనను, ఇటలీయందలి నేపిల్సు నగరముపైనను భయంకరమగు దాడుల సాగించెను. ట్రిపోలీ పైదాడిలో, అచట రేవునందున్న ఒక 10 వేల టన్నుల నౌకకును 7 వేల టన్నుల నౌకకును బాంబులు తగిలి శిథిలమయ్యెను. రెండు "జల విమానము"లు గూడ ముంచివేయబడెను. 12 వ తేదిన బెంఘాజీ, డెర్నా రేవులపై బ్రిటిషు విమానము దాడిసల్పి చా[illegible] నష్టము గల్గించినట్లు ఇటాలియను ప్రకటన యందం[illegible]కరించిరి.

12 వ తేదిన రెండు ఇటాలియను విమానములు జిబ్రాల్టరు రేవు దుర్గము పైకి వచ్చెను. కాని క్రిందనుండి ఫిరంగులు పైకి అగ్నిగుండ్లను విసరుటకు ప్రారంభింపగనే శత్రు విమానములు, బాంబులు వేయకుండగనే వెనుకకు తిరిగి పారిపోయెను.

## గ్రీసు—ఇటలీ.

10 వ తేదిని బ్రిటిషు విమానములు నేపిల్సు నగరముపై దండెత్తి చాలబాంబుల వర్షించెననియు చాలనష్టము కలిగెననియు ఇటాలియను అధికారులు అంగీకరించిరి.

ఇటలీ సంగ్రామమున ప్రవేశించినది మొదలు జూన్ నెలాఖరువరకును 582 వేలకు పైగా సైన్యమును కోల్పోయెను. వీరిలో 132 వేల మంది తూర్పు ఆఫ్రికా జాతుల సైనికులు, ఇటాలియనుల వదలివచ్చి బ్రిటిషు సైన్యములలో చేరిరి. 241 మంది ఇటాలియనులు ఖైదీలుగా చిక్కిరి. క్షతగాత్రులు, హతులు 135 వేలు. 69 వేల ఆఫ్రికా సైనికులు ఖైదీలుగా చిక్కిరి. హతులును, క్షతగాత్రులును మరి 137 వేలమంది.

యుగోస్లావియాలో యింతవరకొక భాగముగనున్న మాంటినీగ్రో శాసనసభ 12 వ తేదిన సమావేశమై, స్వతంత్ర రాజ్యముగ నేర్పడుటకు తీర్మానించెను. ఈ రాజ్యమునకు రాజును, ఇటలీ చక్రవర్తి నియమించునని తెలియుచున్నది.

## తటస్థ దేశములు.

ఐర్లండు శాసన సభలో డివెలరాగారు ప్రసంగించుచు ఇదివరకు వలెనే ఇకమీదగూడ ఐర్లండు ప్రభుత్వము తటస్థముగనే యుండునని ప్రకటించెను.

పోర్చుగలు ప్రభుత్వపు అజోర్సు దీవులకుగాని, వర్డి దీవులకుగాని తమ సైన్యముల నంపి ఆక్రమించవని అమెరికను అధికారులు వాగ్దాన మొసగిరని న్యూయార్కులోని అమెరికను రాయబారి ప్రకటించెను. అమెరికా సహాయ కార్యదర్శి సమ్నరు వెల్సుగారు ఈ విషయమై 14 వ తేదిన మాట్లాడుచు, ఆ దీవులను ఇతరులచేతులలో బడుటకు మాత్రము తామంగీకరింపమనియు, అమెరికా అవలంబించు వైఖరి “ఆత్మ రక్షణ కవసరమగు పరిస్థితులనుబట్టి నిర్ణయమగు”ననియు తెలిపెను.

స్పెయినునందలి బ్రిటిషు రాయబార కార్యాలయము వద్ద ప్రజలలో కొందరు గావించిన ప్రతికూలాార్భాటములకు, స్పెయిను ప్రభుత్వము పశ్చాత్తాపమును తెలిపెననియు, నేరస్తులు శిక్షింపబడిరనియు బ్రిటిషు విదేశాంగ సహాయ కార్యదర్శి పార్లమెంటులో ప్రకటించెను.

రష్యాపై యుద్ధమున పాల్గొనుటకు ఇదివరకు వెళ్లిన వలంటీయరు దళములుగాక, క్రొత్తగా మరిరెండు డివిజనులు సమస్తాయుధపరికరములతోను నాయకులతోను వెళ్లుటకు సిద్ధముగనున్నవి. ఇంతవరకును ఆల్జిసిరాస్ జిల్లాకు సైనికాధికారిగనున్న మనూజ్ గ్రాండెగారు ఈ వలంటీయరు దళములకు నాయకత్వము వహించును.

## నౌకానష్టములు.

జూన్ నెలలో బ్రిటిషువారివి, మిత్రమండలివి కలిసి 79 నౌకలు శత్రులచే ముంచివేయబడెను. వీని పరిమాణము 3,29,296 టన్నులు. గత నాల్గు నెలలతో పోల్చిన యెడల ఇది చాలా తక్కువ.

ఈ వారము, ఆక్లండు అను పేరుగల బ్రిటిషు చిన్న యుద్ధ నౌక (1,200 టన్నులు) శత్రులచే ముంచివేయబడెను.

జూలై నెల మొదటి వారములో, అక్ష రాజ్యముల నౌకలలో అధమము 37 అయినను ముంచివేయబడెను. వీని పరిమాణము 105 వేల టన్నులు. 10 వ తేదిన మూడు జర్మను వర్తక నౌకలు, స్వీడను సమీపములో మందు గనికి తగిలి మునిగిపోయెను. దక్షిణ అమెరికానుండి జర్మనీకి జనుచున్న “హెర్మిస్” అను జర్మను నౌకను, (7,209 టన్నులు) బ్రిటిషు నౌకలు పట్టుకొనెను. 11 వ తేదిన మధ్యధరా సముద్రములో డచ్చి జలాంతర్గామి యొకటి, భర్తీగా సరకుతో ప్రయాణము చేయుచున్న శత్రుల నూనె నౌకను (8,000 టన్నులు) ముంచివేసెను.

## విషీ.

సిరియాలో ఫ్రెంచి హైకమిషనరగు డెంట్జు సేనాని, యుద్ధమును విరమించుటకు షరతుల తెలుపవలసినదని 9 వ తేదిన బ్రిటిషు సైన్యాధికారులను కోరెను. 10 వ తేదిన బ్రిటిషు అధికారులు పది షరతులు గల పత్రమును డెంట్జు సేనానికి అందజేసిరి. వానిలో కొన్ని షరతులకు అంగీకరింప వీలులేదని 11 వ తేదిన విషీ ప్రభుత్వము నిరాకరించెను. కాని తన కుచితమని తోచిన రీతిని వ్యవహరించుటకు విషీ ప్రభుత్వము డెంట్జు సేనానికి అనుమతి నొసగెను. ఆ యధికారమును పురస్కరించుకొని డెంట్జు సేనాని, సిరియాయందలి బ్రిటిషు సైనికాధికారుల వద్దకు రాయబారము నంపెను. ఉభయపక్షములును కలసి మాటలాడుకొనిన పిమ్మట 12 వ తేది రాత్రి 10-40 గంటలకు “ఆకర్సు” నందు ఉభయపక్షములు యుద్ధవిరామ ఒడంబడిక పత్రముపై సంతకము లొనర్చుకొనిరి.

అపుడు పోరాటము విరమింపబడెను. అంతకు పూర్వము బ్రిటిషు సామ్రాజ్య సైన్యములు బైరూటు రేవుపట్టణ పరిసర ప్రాంతముల నన్నిటిని ఆక్రమించుకొనెను. బైరూటును 15 వ తేదిన బ్రిటిషు సైన్యములు ప్రవేశించెను. దానికి 3 మైళ్లలోవున్న డామూరు దుర్గమును బ్రిటిషు సైన్యములు ఆక్రమించినపుడు చాల ఆయుధసామగ్రి పట్టుబడెను. పందలకొలది ఫ్రెంచి సైనికులు ఖైదీలుగా చిక్కిరి సిరియాయందున్న ఇటాలియను అధికారులందరును 13 వ తేదిన టర్కీ చేరిరి.

సిరియాలో ఫ్రెంచి ప్రభుత్వముపైన—బ్రిటిషు ప్రభుత్వముతో గలసి యుద్ధము సాగించిన స్వతంత్ర ఫ్రెంచిసేనాని యగు కాట్రూ సేనానికి ఫ్రెంచి పౌర స్వత్వముల తొలగించుచు విషీ ప్రభుత్వమువారు 12 వ తేదీన ఉత్తరువు ప్రకటించిరి.

ఫ్రెంచి ప్రజా విప్లవ సందర్భమున చరిత్ర ప్రసిద్ధిగాంచిన ‘బాస్టిలీ దుర్గ నిర్మూల’ నోత్సవము ప్రతి యేటా 14 వ తేదిన జరుగుచుండును. ఈ వత్సరము ఆ యుత్సవముల జరుపరాదనియు, ఆ రోజున ప్రజలెల్లరు విచారసూచకముగ గడుపవలెననియు విషీ ప్రభుత్వము ఉత్తరువు గావించెను.

## అమెరికా-అట్లాంటిక్.

అమెరికా సంయుక్త-రాష్ట్రముల రక్షణ సన్నాహములకుగాను ఇంకను 477 కోట్ల డాలరులను మంజూరు చేయవలసినదని రూజ్వెల్టు అధ్యక్షుడు కాంగ్రెసును 10 వ తేదిన కోరెను. శుక్రవారమునాడు మరి 332 కోట్ల డాలరులను గోరెను.

పశ్చిమార్థ గోళమునుదాటి ప్రపంచమునం దితర ప్రాంతములకుగూడ సైన్యముల నంపుటకు ప్రభుత్వమునకు అధికారము నొసగు విషయమై రూజ్వెల్టు అధ్యక్షుడు 12 వ తేదిన శాసన సభా నాయకులతో సంప్రదించెను.

ఉత్తర ఐర్లండునందును స్కాట్లండునందును సంయుక్త రాష్ట్ర ప్రభుత్వము నావికా కేంద్రముల నేర్పరుచుకొనవలెనని విండెలు విల్కీగారు సూచించిరి. సంయుక్త రాష్ట్ర—బ్రిటిషు ప్రభుత్వములు అంగీకరించుచో తమ దేశమున నట్టి సౌకర్యము నొసగుట కాక్షేపణయుండదని అల్స్టరు ప్రధాని నుడివెను. అల్స్టరులో, అమెరికను కార్మికులును ఇంజనియరులును, బ్రిటనుకొరకు క్రొత్త యుద్ధ నౌకా నిలయమును నిర్మించుచుండిరని వెల్లడింపబడెను

సంయుక్త రాష్ట్ర రేవులలోనున్న 30 అక్ష రాజ్యాల నౌకలపై తమకుగల హక్కును బ్రిటిషు ప్రభుత్వము వదులుకొనెను. దీనివలన నిక సంయుక్త రాష్ట్ర ప్రభుత్వము నౌకల నుపయోగించుకొన వచ్చును.

సంయుక్త రాష్ట్రములలో బ్రిటిషు రాయబారిగనున్న హాలీఫాక్సు ప్రభువు ఆగస్టు మాసమున బ్రిటనుకు తిరిగివచ్చి రెండు మూడు వారములవరకు బ్రిటనునందుండునని వార్తలు తెలుపుచున్నవి.

బ్రిటనుకు సహాయమొనర్చుటకు సంయుక్త రాష్ట్ర ప్రభుత్వ మనుసరించుచున్న పద్ధతులవలన సంయుక్త రాష్ట్ర ప్రభుత్వము జర్మనీతో యుద్ధమున దగుల్కొనవలసిన పరిస్థితు లేర్పడవని కర్నలు నాక్సుగారు నుడివిరి.

## మదరాసు "డిఫయంటు" స్క్వాడ్రను.

మదరాసు రాష్ట్ర చందాలతో కొన్న విమానదళ మిదివరకు ఒకేరోజున 30 శత్రు విమానాలను నాశనం చేసిన కీర్తిబడసినది. ఇపుడాదళం మరో 14 శత్రు విమానాలను రాత్రిదాడులందు పడగొట్టెను. ఆ దళనాయకుడు, మదరాసుపేరిట యీ ఘనకార్యము లొనరించుటకు వైమానికులు చాల గర్వించుచున్నారని తెల్పుచు, మదరాసు గవర్నరుగారికి తంతివార్త నంపిరి.

సంయుక్త రాష్ట్ర ప్రభుత్వము సైన్యముతో సహా యుద్ధమున పాల్గొనుటవసరమని, మధ్య ప్రాచ్యమున బ్రిటిషు సర్వసేనానియగు అచిన్‌లెక్‌గారును, వేవలు సేనానియుగూడ తెలిపిరి.

సంయుక్త రాష్ట్ర ప్రభుత్వము ఇక బహిరంగముగ బ్రిటను రష్యాల తరపున యుద్ధమున దిగునేమోనను భయమును వెల్లడించుచు జర్మను పత్రికలు విమర్శించుచున్నవి.

రూజ్వెల్టుయొక్క అంతరంగిక కార్యదర్శియగు స్టెపెన్ యర్లీగారు-జర్మనీ అధికార రీత్యా సంయుక్త రాష్ట్ర ప్రభుత్వమునకు యెట్టి సంధి షరతులను అందచేయలేదనిరి. అనధికార రీత్యా హిట్లరు ఏజెంటులు అమెరికాలో కొందరకు సంధి షరతులు అందజేసినట్లు తనకు తెలియునని సమ్నరు వెల్సుగారు నుడివిరి.

## టర్కీ - ఈరాక్ - ఈరాన్.

బేరూటు (సిరియా) నుండి సైనికుల మరల్చుకొని పారిపోవుచున్న 6,000 టన్నుల సాయుధ పరాసు నౌక యొకటియు, మరియొక ట్రాలరును 9 వ తేదిన టర్కీ రేవును ప్రవేశింపగా, టర్కీ అధికారులు వానిని నిలిపివేసి, అందలి నావికులను నిర్బంధమునందుంచిరి. 10 తేదీన మరి 11 ఫ్రెంచి నౌకలు అలెగ్జాండ్రెట్టా రేవులో ప్రవేశించెను. అవి 24 గంటలలో కదలివెళ్లకపోవుటచే, టర్కీ అధికారులు వానిని స్వాధీనపరచుకొని, సిబ్బందిని ప్రవాసమునందుంచిరి.

టర్కీ-బల్గేరియా సరిహద్దులలో బల్గేరియనులు సైన్యముల కేంద్రీకరించుచుండిరనియు, దీనితోపాటు బల్గేరియా ప్రభుత్వము సైనికులను సమీకరించుచున్నదనియు వదంతులు వ్యాపించుచున్నవి.

## రష్యా.

9 వ తేదీన ఫినలండు రంగమున సల్లా పట్టణమును ఆక్రమించితిమని జర్మనులు ప్రకటించిరి. 1938 వ సం॥మునందలి రష్యా సరిహద్దులలో, రష్యనులు నిర్మించుకొనిన స్టాలిన్ ప్రాకారశ్రేణిని భేదించి లోపలికి చొచ్చుటకు జర్మను సైన్యములు 7 తేదీనుండియు భయంకరముగు దాడులు సాగించుచున్నవి. ఉభయపక్షములకు అపారమగు నష్టముగలుగుచున్నది. దక్షిణమున ప్రూత్ నది ప్రాంతమున హంగేరియను సైన్యములు 25 వేల రష్యను సైనికులను పట్టుకొనెనని హంగేరియనులు ప్రకటించిరి. మిన్స్కునకు ఉత్తరముననున్న లెపెలు రంగమున ఒక జర్మను సాయుధ శకటదళమును 100 టాంకులను పూర్తిగ నిర్మూలింపబడెనని రష్యనులు ప్రకటించిరి. బియాలిస్టాక్, మిన్స్కు ప్రాంతములలో జరిగిన పోరాటమున 3,332 టాంకులను 6,000 రష్యను విమానములను ధ్వంసమొనర్చితిమనియు 1,809 ఫిరంగులను 323 వేల ఖైదీలను అపారమగు మందుగుండు సామగ్రిని పట్టుకొంటిమనియు 12 తేదీన జర్మను అధికారులు ప్రకటించిరి. 7 వ తేదీనుండియు జర్మనులు స్టాలిను ప్రాకారశ్రేణిపై పెద్ద దాడులెక్కడను జరుపలేదు. అన్ని రంగములందును రష్యను సైన్యములు జర్మను పురోగమనమును నిలిపివేసెను. జర్మనులు ఆక్రమించిన ప్రాంతములలో రష్యను స్త్రీలును పిల్లలునుగూడ, జర్మను సైన్యముల నెదిర్చిపోరాడుచు, శత్రులకలవరపరచుచున్నారు. స్టాలిను ప్రాకారము వద్ద ఉభయపక్షములును అపారమగు సైన్యమును ఆయుధ సామగ్రిని కేంద్రీకరించుచున్నవి. సోవియటులు 80 లక్షల సైన్యమును సిద్ధపరచుచున్నారు. జర్మనులు విష సంబంధమగు ఆయుధముల నుపయోగించుచుండిరని రష్యనులారోపించుచుండిరి. ఆ యారోపణయందెట్టి సత్యమును లేదని జర్మనులు ఖండించిరి. 13 వ తేదిన జర్మనుల ప్రకటనలో, స్టాలిను ప్రాకారమును పలుచోట్ల భేదించితిమనియు, జర్మను సైన్యములు ఉత్తరమున లెనిన్‌గ్రాడును దక్షిణమున యుక్రేనియా రాజధానియగు కీవు నగరమును సమీపించుచుంటిమనియు 13 వ తేదిన జర్మనులు ప్రకటించిరి.

ఉత్తరమున జర్మను సైన్యములు ప్రేపస్ సరస్సునకు తూర్పుగా నాక్రమించి అచ్చటనుండి లెనిన్‌గ్రాడును పట్టుకొనుటకు ముందుకు సాగిపోవుచున్నవని 14 వ తేదిన జర్మను ప్రకటన తెలుపుచుండెను. బెస్సరేబియా ప్రాంతపు యుద్ధమున 14 వ తేదిన 2 జర్మను సైనిక దళములు పూర్తిగ నిర్మూలింపబడెను. అపారమగు ఆయుధసామగ్రి పట్టుకొనబడెను. లెనిన్‌గ్రాడునకు దక్షిణముననున్న నొవోగరాడు పట్నమును తామాక్రమించితిమని జర్మనులు 16 వ తేదిన

ప్రకటించిరి. రష్యనులు యుక్రేనియాయందునను, ఇతర రంగములందును తాము వెనుకకు పోవలసివచ్చినపుడు సమస్తవస్తువులను సంపదలను నిర్మూలముచేసి, మరివెనుకకు పోవుచున్నారు.

రుమేనియాయందలి కాంస్టాంజారేవుపైనను, ప్లాయిస్టీ పట్టణమందలి నూనె రిఫైనరీలపైనను సోవియటు విమానములు తీవ్రముగ దాడి సాగించి నౌకలను నూనె గిడ్డంగులను ధ్వంస మొనర్చెను.

రష్యా ప్రభుత్వము పంపిన సైనిక రాయబారవర్గము లండనునందు దిగి, 10 వ తేదీన నౌకా విమానశాఖ కార్యాలయముల దర్శించిరి.

బ్రిటిషు ప్రభుత్వమును సోవియటు ప్రభుత్వమును కలసి 12 వ తేదీన మాస్కో నగరమున ఒక యొడంబడికను గావించుకొనినవి. ఉభయదేశములు, కలసి జర్మనీపై తుదివరకు పోరాడెదమనియు, ఒకరిని వదలి మరియొకరు ప్రత్యేకముగ శత్రువులతో సంధిగావించుకొనరాదనియు ఆ యొడంబడికలో గలదు. దీనివలన రష్యా-ఇంగ్లండులు మిత్రమండలిగ నేర్పడెనని చర్చిలు ప్రధాని ప్రకటించెను.

18 వ తేదీన బాల్టికు సముద్రమున చాల సైన్యమును ఆయుధ సామగ్రిని మోసుకొని పోవుచున్న పెద్ద నౌకల జట్టును రష్యను విమానము లెదిర్చి 14 సైనిక నౌకలను 2 చిన్న యుద్ధ నౌకలను టాంకులతో నిండియున్న మరియొక నౌకను ముంచివేసెను.

### దూర ప్రాచ్యము.

ఐరోపా సంగ్రామము అక్షరాజ్యములకు అనుకూలముగ పరిణమించునెడల, జపాను మంత్రివర్గము పసిఫిక్ దక్షిణ దీవులపైకి దండయాత్ర సాగించుటకు నిశ్చయించుకొనినదని వదంతులు వ్యాపించుచున్నవి.

జపాను, అక్షరాజ్యములవెంట నడవవలసిన అవసరము లేదనియు, జర్మనీ ఆజ్ఞల శిరసా వహింపవలసిన గతి జపానుకు పట్టలేదనియు, ఆంగ్ల దేశముతోడనే జపానునకు ఎక్కువ సన్నిహిత సంబంధముగలదనియు, వాంకూవరుయందలి జపాను కౌన్సులుజనరలగు ఇషీరో కవాసకీగారు పత్రికా విలేఖరులతో నుడివెను.

బ్రిటను, సంయుక్తరాష్ట్రముల ప్రభుత్వములు ఆయుధసహాయ మొనర్చినయెడల, ఈ సంవత్సరాంతములోగా చైనా సైన్యములు జపానుసైన్యములను తరిమివేయగలవని లండనులో చైనా రాయబారి వెల్లింగ్టన్‌కూగారు ప్రకటించిరి. బ్రిటిషు ప్రభుత్వమువారు సంగ్రామానంతరము శాంతి నెలకొనిన పిమ్మట,— చైనాలో తమకున్న ప్రత్యేక రాజకీయ హక్కులను వదలుకొనెదమని చైనా ప్రభుత్వమునకు వాగ్దానమొనర్చిరి.

రష్యా-బ్రిటనులు గావించుకొనిన సైనిక మైత్రి యొడంబడికను జపాను పత్రికలు విమర్శించుచు అసంతృప్తిని వెల్లడించెను. విదేశాంగ శాఖాధికారియగు ఇషీగారు పత్రికా విలేఖరుల ప్రశ్నలకు సమాధానమొసగుచు రష్యా-జపాను నిరాక్రమణ యొడంబడిక ప్రస్తుతమునకు మాత్రము నిలిచియున్నదనెను. జపానుకూడ త్వరలోనే యుద్ధమున దిగునేమోనని అమెరికా, బ్రిటిషు అధికారులు జాగ్రత్తగా కనిపెట్టుచున్నారు. అంతర్జాతీయ విషమ పరిస్థితుల నెదుర్కొనుట కిప్పటి కంటె బలవత్తరమగు మంత్రివర్గము నేర్పరచుటకుగాను 16 వ తేదీన జపాను మంత్రివర్గము రాజీనామా నొసగెను.

### ఆక్రమిత ప్రాంతములు.

జర్మను ఆక్రమణలోనున్న నార్వే రాజధానియగు ఆస్లో నగరమున ప్రజలు అమెరికా స్వాతంత్ర్య సందేశమునకు అబ్రహాం లింకను విగ్రహమునకు పూలదండలు వేయబోగా పోలీసులు అడ్డగించిరి. అపుడు ప్రజలకును పోలీసులకును నగర వీధులలో చాల గంటలసేపు పోరాటము జరిగెను. తుదకు అధికారులు సైన్యముల రప్పించి ప్రజలను చెదరగొట్టిరి.

బ్రిటిషు సైన్యములు, ఐరోపాలోని ఆక్రమిత ప్రాంతములలో దిగి దాడి సాగించునేమో యను భయముచే, ఫ్రాన్సు, బెల్జియము, హాలండు మొదలగు ఆక్రమిత ప్రాంతములలో జర్మనులు బలమగు సైన్యములను నిలిపియుంచిరని జర్మను పత్రికలు వ్రాయుచున్నవి.

బ్రిటీషువారి బ్రెన్ తుపాకులను మోయుబండ్లు.



స్కాట్లండు దేశములో ఈ బండ్లు మంచుపడియున్న రోడ్డుమీద పోవుచున్నవి. పడమటి ఎడారిలో బ్రిటీషు బలములతో నున్నమాదిరిగానే, యీ మంచులోకూడ అవి చక్కగానే ఉన్నవి.

# చీనా బలం, ఐకమత్యం ఎక్కువైనాయి.

## జపాను యుద్ధం ప్రారంభించి నాలుగేళ్లు నిండేయి.

## ఇంతవరకు సాధించగల్గిందేమిటి ?

ఉత్తర చీనా ప్రాంతములందున్న జపాను సేనాధికారి రాత్రిపూట సైన్యాలతో తిరుగుతు లుకోచియు దగ్గర మార్కొపోలోవంతెన చేరువనుండగ 1937 వ సం॥ జూలై 7 వ తేది రాత్రి తన సైనికులలో నొకడు తప్పిపోయినట్లు కనుగొన్నాడు. అతన్ని చీనా సైనికులు రహస్యంగా ఎత్తుకపోయి ఏవో నగర గోడలమధ్య దాచియుంటారని అతడు వెంటనే చిత్రంగా నిర్ణయించేడు. కావున తన సైన్యాన్ని అపూరులో ప్రవేశించుటకు అనుమతి కోరేను. చీనావారు సహజంగా నిరాకరించేరు. అపటి చీనావారు బుద్ధిపూర్వకంగ తమ భటులపై తుపాకులు కాలిస్తే, తాము కూడ తిరిగి కాల్చవలసివచ్చిందనీ అందుచే జపాను తూర్పు ఆశియాఖండంలో "క్రొత్త వ్యవస్థ" స్థాపించుటకు 1,125,000 ఆయుధ సైనికులను పంపాల్సివచ్చిందని జపాను ప్రకటించెను. మరునాడు ప్రాతఃకాలమునందును, పగలు అనేకసార్లుగా జపాను ఫిరంగులు ఆ నగరంపై ప్రమోగేయి. 1931 లో మంచూరియాను ఆక్రమించినప్పటి నుండి ఉత్తర చీనాలో జపాను సేనలున్నవి. అవి చాలా అత్యాచారాలు చేస్తున్నాయని జపాను ప్రభుత్వానికి చీనా నిరసనం తెల్పుతునేవుంది. ఉత్తర చీనానుకూడ మంచుకో మాదిరిగ ఆక్రమించు ఉద్దేశంతోనే జపాను సైన్యాలను మంచుకోనుండి చీనాకు పంపెను. చీనా ముఖ్యపట్నమగు నాంకింగునుండి చీనా సేనలు ఉత్తరానికిపోయి వాంగుపింగువద్ద యుద్ధం చేసేయి. వారం రోజులలో పైపింగునగరంపై జపాను విమానాలు బాంబులువేసినాయి. మరునాడు చీనా అధ్యక్షుడును సేనాధిపతియునగు మార్షలు చియంగుకాయి షేకు దేశీయులందరిని యిట్లు హెచ్చరించెను :—"దేశంలో ఒక్కడు మిగిలేవరకుకూడ యుద్ధం చేయడానికి చీనా నిశ్చయించింది. దేశరక్షణకై దేశీయులందరు సైన్యంలో చేరాలని కోరుతున్నాను." ఆనాడే జపాను సైన్యాలు పైపింగు నగరంపై దాడిసలిపి ఆక్రమించినవి. ఆ మరునాడు టీంట్సినుకూడ పడిపోయింది. ఆగష్టు 15 వ తేదిన జపానువారు షాంగే రేవు పట్నంపైగూడ దాడి సాగించేరు. ఆ యుద్ధానికిపుడు నాలుగేండ్లు ముగిసి ఐదో ఏడు ప్రారంభమైంది.

### మొదటి రెండేళ్లు జాపాను ఘోరాలు.

షాంగే నగరంలో యుద్ధం 1937 వ సం॥ నవంబరు 9 వ తేదివరకు నాల్గు నెలలు కొనసాగింది. గత యుద్ధంలో వెర్డూనువద్ద సాగిన పోరువలె యీ పోరులోగూడ లక్షలు చనిపోయేరు. చీనా సేనలు చాల తీవ్రమైన నిరోధంచేసేయి : కాని క్రమేణ విరమించవలసివచ్చెను. షాంగేను వదలుకొన్నారు. వారి ముఖ్యపట్నమగు నాంకింగునుకూడా డిసంబరులో గోల్పోయేరు. నాంకింగు చాల చరిత్రాత్మకమైన స్థలమగుటచే మక్కువతో దాని రక్షించుటకై మార్షలు చియంగు కాయిషేకు చాల కష్టపడి నష్టపోయెను. చీనా సేనలు జపాను సేనలను వెనుకనుండి కొట్టుచుండెను. జపాను సేనకు కోపంవచ్చి, పిచ్చెత్తినవారై అనేక రాక్షసకృత్యాలకు గడంగెను. హత్యా, మానభంగం, లూటీంగు, సర్వనాశనం చేస్తు కసితీర్చుకొనుచు 50,000 మంది సామాన్య అమాయక ప్రజలను చంపిరి. అంతేకాక విదేశాలకుకూడ నష్టం కలిగించి ఆగ్రహం తెప్పించినవి. నాంకింగుకి కొద్దిదూరంలో యాంగ్జి నదియందు అమెరికావారిదగు పానేయను యుద్ధనౌకను ముంచివేసి, అందుండి తప్పించుకపోతున్నవారిని మర ఫిరంగులువేసి కాల్చిరి. ఈ దారుణ చర్యలు టోకియోలోనున్న జపాను ప్రభుత్వానికిగూడ అగ్గజంగానుండి అమెరికా కోరిన నష్టపరిహారం 4,42,801 సవరనులు వెంటనే యిచ్చివేసింది.

జాపాను సేనను నానా చిక్కులుపెట్టి పగ సాధించుటకు మార్షలుచియంగు కాయిషేకు నిశ్చయించెను. కొంతవరకు యుద్ధంచేయడం వెనుకకు తగ్గడం, శత్రువును ముందుకు రానిచ్చి పైబడడం, ఈ విధంగా చేసి జాపాను దాడిని కష్టతరమొనర్చెను. 1938 వ సం। మార్చిలో చీనా తిరుగుదాడి జరిపి షాంటుంగు రాష్ట్రంలో టాయిరుచంగునందు చిరస్మరణీయమగు విజయంపొందింది. అయినా ఆరు నెలల్లో జపానువారు తామనుకొన్న పనిచేయగల్గిరి. చీనా క్రొత్త ముఖ్యపట్నం హాంకోనగరం. యాంగ్జి నదిలోనున్న తమ నౌకల సహాయానా, విమానాలు వేస్తున్న బాంబుల సహాయానా జపానీయులు హాంకోనగరాన్ని అక్టోబరు మాసంలో పట్టుకొగల్గిరి.

చీనా సేనలు పడమరకుపోయి జెచువానునందు క్రొత్త స్థానములను ఏర్పరచుకొని, చుంగ్‌కింగు నగరం ప్రభుత్వ స్థానంగా చేసుకొన్నాయి. ఉత్తరాన గొరిల్లా సేనలు (దాగియుండి అకస్మాత్తుగా యుద్ధంచేసి పారిపోవునవి) తీవ్రంగా యుద్ధంచేసి షాంసినగరాన్ని కాపాడినవి. హాంకో నగరం పడకముందే కాంటనునగరం శత్రువుల వశమయింది. జాపానునౌకాదళ కాపుదారక్షణక్రింద సుమారు 40,000 జపానుసేన బియసువే రేవునందుదిగెను. 1938 లోనే చీనా తీరంఅంతా శత్రువులు దాడి ప్రారంభించి హైనాను దీవుల నాక్రమించి, చుంగ్‌కింగుపై తీవ్రంగా బాంబులు వేస్తుండిరి. అంతమాత్రాన చీనాప్రజలు ధైర్యం వీడలేదు సరికదా, మరింత శక్తి యెక్కువ చేసుకొనిరి.

1939 : వేసంగిలో షాంసి రాష్ట్రమునందు చీనావారు చెప్పదగ్గ విజయాలు పొందేరు. జపాను ఉన్నతాధికారులు ఓరుకోలేక చాంగ్షాపై దాడి ప్రారంభించిరి. కాని చీనాసేనలు తుక్కురేగగొట్టినవి. ఈ యుద్ధంలో యింత గొప్పవిజయం యింకెక్కడా పొందలేదు. నిరాశచెంది ఉద్రేకంతో జపానుసేన నాన్నింగుపై దాడిసాగించి, ఫ్రెంచి ఇండోచీనానుండి చీనాకు ఆయుధాల దిగుమతి కాకుండా నిలిపివేసెను. ఇచాంగుకూడ వారివశమగుటచేత జపానీయులు చుంగుకింగుపై తరచు విమానదాడి జరుపుట సులభమయింది.

### 1940—ఇతర దేశాల జోక్యం.

చియంగు కాయి షేకుగారికి ఎదురు తిరిగిన చీనా జాతీయ నాయకుడు వాంగుచింగువైగారిని 1940 వ సం॥ మార్చిలో నాంకింగు ప్రభుత్వాధ్యక్షునిగ జాపాను నియమించెను. ఈతడొక జపాను కీలుబొమ్మవలె ప్రవర్తించుచున్నాడు. ఇంగ్లాండు అమెరికాలు యీతని ప్రభుత్వాన్ని గుర్తించలేదు. రంగూనునుండి చీనాలోనికి యుద్ధసామగ్రి దింపుటకు బర్మా రైల్వే ఆఖరు స్టేషనగు లాషియోను చుంగుకింగునకు కలుపు బర్మా రోడును ఉపయోగించరాదని జపాను ప్రధాన మంత్రి బ్రిటిషువారికి నిరసనను తెలిపెను. తూర్పు ఆశియాలోను దక్షిణ సముద్రాలపైనా జపానుదే అధికారమనియు, యితర రాజ్యాలేవియు చీనాలో తాము స్థాపించ

దలచిన "క్రొత్త వ్యవస్థకు" బ్రిటను అడ్డు రాకూడదనియు, జపాను ప్రధాని ప్రకటించెను. చీనాతో మూడు నెలలలో జపాను సంధి చేసుకోడానికి అవకాశమిస్తు, బ్రిటిషువారు బర్మా రోడును ఆయుధ సామగ్రి రవానాకు మూసి వేస్తూ జపానుతో ఒక ఒడంబడిక జూలైలో గావించుకొన్నారు. దీని వలన చీనాకు కోపంవచ్చింది, అమెరికా అధికారులు తీవ్రంగా విమర్శించేరు, జపానుకూడా సంతృప్తి చెందలేదు. జపాను ప్రధానిగ నుండిన అడ్మిరలు యోనిగారు జూలై 17 వ తేదిన రాజీనామా నిచ్చిరి. ప్రిన్సుకొనాయిగారు ప్రధాన మంత్రియు మరియు ఓకా గారు విదేశాంగ మంత్రియు అయినపిమ్మట, జపాను విదేశాంగ విధానం మారింది. ఒడంబడిక నియమాలను ఉల్లంఘిస్తున్నారని బ్రిటిషు రాయబారి సూచించినా జబాబులేదు. పైగా జపానులోనున్న బ్రిటిషు ప్రజలను హింసించడం ప్రారంభించేరు. షాంగేలోనున్న బ్రిటిషు సేన తీసివేయబడింది. అమెరికాతోగూడ జపానుకి చెడుతున్నాది. జపానుకి పెట్రోలుకాని, రద్దు ఇనుముగాని పంపరాదని అమెరికా నిషేధించుటతో జపాను యుద్ధ ప్రయత్నాలకి నిరోధం కలిగింది. సెప్టంబరులో జపాను అక్ష రాజ్యాలతో పదేండ్లవరకు సఖ్యత ఒడంబడిక చేసుకుంది. దీనికి జవాబుగా ఇంగ్లాండు బర్మా రోడును ఆయుధాల రవానాకు తెరచెను. బర్మా సరిహద్దువరకు రైల్వేకూడ వేస్తున్నారు. కనుక చుంగుకింగునకు యిక ఆయుధాల దిగుమతికి కొదువయుండదు. జపాను-జర్మనీ ఒడంబడిక తేమకు బెదరింపుగా అమెరికా ఎంచెను. చీనా ప్రభుత్వానికి అమెరికా 100,000,000 డాలరుల ఋణము, ఇంగ్లాండు 10,000,000 సవరల అరువు యిచ్చేయి. నవంబరులో జపాను సేనలు దక్షిణమునుండి వెనకకుబోయి, చీనా అంతకు నాంకింగు ప్రభుత్వమే న్యాయమగు ప్రభుత్వమని ప్రకటించెను. కాని దీనివలన ప్రయోజనము లేకుండెను.

**1941.**—ఈ విడాది హిట్లరువద్ద పాఠం నేర్చుకొని జపాను రషియాతో నిరాక్రమణ ఒడంబడిక చేసుకొంది. కాని రషియాపై జర్మనీ దాడి వెడలుటచే అంతర్జాతీయ పరిస్థితులు తారుమారై, జపాను తన సైనిక చర్య ఏవిధంగా నుండునో బయటకు చెప్పలేకుండా వుంది. చైనాయందు మూడు రంగాలలో జపాను సేనల దాడి నిరోధింపబడింది. ఒక్కచోట కొలుత ముందుకు సాగేరు. ఉత్తరాన మాత్రం జపానీయులు కొంత జయించేరు. దక్షిణ షాంషి రాష్ట్రమున పసుపునది చేరువ టంగుఫెంగు రేవును ఆక్రమింపకలిగేరు. చీనావారిని నది దక్షిణతీరానికి తరిమివేసేరు. ఉత్తర షాంషి రాష్ట్రమునందు అదివరకు చియాంగు కాయిషేకు పరిపాలనకు విముఖంగానుండిన కమ్యూనిష్టు సైనికదళం యిపుడు చియాంగుతరఫున తీవ్రంగా యుద్ధంలో పాల్గొంటున్నది.

## మూడు నెలలనుకున్నది నాలుగేండ్లకు కొరకబడలేదు.

చిన్న యుదంతంగానెంచి యిప్పటికీనీ చిన్న "ఇంసిడెంటు" అనే పేర్కొనుచు, మూడు నెలలలో ముగిస్తామని జపాను సామ్రాజ్యసేన తలంచిన యీ చిన్న కార్యం నాలుగేండ్లకుకూడ ముగియలేదు. ఒకరినొకరు విసిగించుకొనుటకు బహిష్కారయుద్ధం ప్రారంభమైంది. హాంకోనగర పతనంతో చీనాయుద్ధంలో సైనిక ప్రాధాన్యత తగ్గింది. చీనా చాల పెద్దదేశమగుటచే జపాను ఎంత తీవ్రమయిన మెరుపు యుద్ధం సాగించినా ఫరవాలేదు. మనుష్యశక్తి ప్రకృతి సంపద విపరీతంగానుండుటచే చీనాప్రభుత్వం వాటిని బాగా వినియోగించుకుంటున్నది. చీనా ప్రాచీన చరిత్ర విజ్ఞానము ప్రజలకు ధైర్యస్థైర్యములను దూరదృష్టి నొసంగినవి. ఇంగ్లాండు, అమెరికా, రషియాలనుండి వస్తున్న సహాయం నానాటికి పెరిగి చీనా రక్షణదిట్టమగుచున్నది. చీనా ఎంత కాలమేనా నిలువగలదు. నిలకడగా సైన్యాలు యుద్ధం చేస్తున్నాయి. ఇతరచోట్ల గాలివాటుగా జరుగు యుద్ధాలలో జపాను సేనలకు స్వరక్షణతోనే సరిపోతున్నవి. రెండు రకాల యుద్ధాలందు చీనా గొరిల్లా సైనికులు నిలకడ సైన్యాలకు ఎక్కువ తోడ్పడుచున్నారు.

## చీనా విదేశాంగ మంత్రి ప్రకటన.

చీనా క్రొత్త విదేశాంగ మంత్రి ఇంగ్లీషువారి విందులో యిట్లు చెప్పేడు: "ప్రస్తుత ప్రపంచ పరిస్థితుల్లో చీనా ప్రాముఖ్యత యిప్పుడు గుర్తింపబడింది. మొదటి రెండేండ్లు మేము ఒంటరిగనే పోరాడవలసివచ్చింది. చీనా జయింపబడజాలదు. ఇంగ్లాండునకువలెనే మాకు గొప్ప నాయకుడున్నాడు. మా చర్చిలు చియాంగు కాయిషేకు. మీ ప్రజలవలెనే మా ప్రజలుకూడ మొక్కవోవని ధైర్యం, సాహసం, ఓర్పుగలవారు. నేడు చీనాలో 10 లక్షల జపాను సేన చిక్కువడియుంది. పది లక్షలమంది దెబ్బతిని చనిపోయియుంటారు. చీనాకో! 50 లక్షలమంది సైనికులుగలరు. చీనాకు బరువైన ఫిరంగులు, విమానాలు తప్పతక్కిన ఆయుధాలన్ని సమృద్ధిగా ఉన్నాయి. తిరుగు దాడికి అవసరమగు ఫిరంగులు, విమానాలుకూడ త్వరలో రాగలవు."

చీనాను జపాను ఎన్నటికి పడగొట్టజాలదని మార్షలు చియాంగుకాయిషేకు ధైర్యంగా ఉన్నాడు. హాంకో నగరం పడిపోయినపుడు చీనాకు ఎవ్వరి సహాయం లేకుండెను. చాల హీనస్థితియందున్న అప్పుడే, జర్మను రాయబారియగు డా॥ ట్రాటుమనుగారు చియాంగుషేకును సంధికి ఒప్పించలేకపోయెను. ఇంకోసారి ప్రయత్నిస్తేకూడ విఫలమగును. జపాను పెద్దలుకూడ నిజం తెలుసుకోకపోలేదు. యుద్ధం ముగిసి శాంతికుదిరే చిహ్నాలగుపడవని ప్రధాని కొనాయిగారు జనవరిలో అన్నారు. చుంగుకింగు ప్రభుత్వాన్ని సైనికబలంతో ఓడించ నవసరంలేదు. యిపుడాక్రమించిన ఐదు రాష్ట్రాలలో ఆర్థికసంపదాభివృద్ధి చేసుకుంటే చాలని తనకా సేనాని ఫిబ్రవరిలో జపాను శాసనసభలోనే చెప్పేడు. 1940 లో జపాను సేనలు చీనా బియ్యంలో నూటికి 60 వంతు దాము తీసుకొని దానికిబదులుగా యెనునోట్లను యిస్తే, అవి చీనాలో చెల్లక వారాక్రమించిన ప్రాంతాల ప్రజలకు తిండిలేకుండెను.

వ్యాపారమంతా జపాను సైన్యం చేతిలోనుంచుకొని సరియైన ధర యివ్వకుంటె, వారాక్రమించిన చీనాప్రాంతం ప్రజలు వారికెట్లు తోడ్పడతారు? కావున యుద్ధం ఖర్చయినా ఆదేశంనుండి జపాను రాబట్టలేకుండా ఉంది.

చీనా నష్టం.—యుద్ధంవలన జపానుకన్న ఎక్కువగ చీనా నష్టపోయింది. మధ్య రాష్ట్రములు తీరప్రాంతముల సంపదంతా జపాను సైన్యం కొల్లగొట్టింది. శత్రుసైన్యాల నిషా పదార్థాల వ్యాపారంవలన వచ్చు రాబడి వాంగుచింగువేగారి కీలుబొమ్మ ప్రభుత్వానికి వచ్చే రాబడిలో పెద్ద మొత్తం. సైన్యాలతోపాటు విద్యావంతులుగూడ చీనా లోభాగాలకు పారిపోయేరు. కాలేజీలు విడచిన విద్యార్థులే దేశ పరిపాలనకు తోడ్పడుచున్నారు. నేర్పరులగు పనివారుగూడ తమ పనిముట్లు యంత్రాలతోగూడ జపాను ఆక్రమించిన ప్రాంతాలు విడచివచ్చి చుంకింగు ప్రభుత్వంలో తమ పనులను సాగించు

కొనుచున్నారు. 70 మంది యంత్రాల పనివారు 200 టన్నుల యంత్రాలు బండ్లపైవేసి కొండలపైనుండి చేతులతో లాగుచు నాల్గు నెలలు నడచి శత్రువుల బాంబులను తప్పించుకొని వచ్చిరి. ఇట్టి ధీరులు 20,000 చీనా సహకార సంస్థలలో పనిచేయుచున్నారు. ఇట్టి దేశాభిమాన ముండుట అరుదు. చీనా విశాలమైన దేశం కనుక అంతటిని శత్రుసైన్యం ఆక్రమించుట అసాధ్యము. అంతేకాక విశేష జనసంఖ్య ఉంటచే లక్షలకొలది సైన్యంలో చేగ మరికొన్ని లక్షలు పరిశ్రమలలో పాటుబడుచున్నారు.

చీనాయుద్ధంలో యిమిడియున్న నైతిక ఆర్థిక రాజకీయ సైనిక విశేషము లిట్టివి. బెదిరింపులకుగాని, బూటకపు రాజీసూచనలకుగాని చీనా లొంగిపోదు. "అభేద్యమగు చీనా విప్లవతత్వం అపజయం ఎరుగదు" అని చియంగు షేకు వారం రోజుల క్రిందటే చెప్పెను. ప్రపంచమంతా ఆక్రమించి స్వాతంత్ర్యాన్ని ప్రజాప్రభుత్వ విధానాన్ని రూపుమాపదలచిన నిరంకుశ నియంత పాలనమును ఎదుర్కోడానికి ఇంగ్లాండు, అమెరికా, రషియా, చీనాలు నడుం బిగించాలని అతడనెను.

---

# జపానుకు ప్రాణసంకటం.

## రష్యాతో యుద్ధం చేస్తుందా మానుతుందా?

## హిట్లరు తెచ్చిపెట్టిన చిక్కు.

రష్యాపై హిట్లరు దాడిచేయడం జపానుకి ప్రాణసంకటంగా ఉంది. జపానులో రాజకీయ పెద్దలంతా సభలు చేసేరు. వారితో మంత్రివర్గం సంప్రదించి, చాల ముఖ్యమయిన నిర్ణయం చేసింపటుగాని, అదేమిటో ప్రపంచానికి చెప్పలేము. గత బుధవారం జపాను మంత్రులు రాజీనామా నిచ్చినారు. తమ దేశంలోను నానా జాతులమధ్యనుగల పరిస్థితులను ఎదుర్కొనుటకు గట్టి ప్రభుత్వము ఏర్పడాలనే ఇట్లు చేశారు. జపాను రష్యాతోగాని, డచ్చివారి తూర్పు దీవులతోగాని యుద్ధానికి దిగితే వర్తకానికి భంగం కలుగునను భయంతో వర్తకులిందుకు కారణమైయుండవచ్చును. ప్రస్తుతే మంత్రులు ధైర్యం చూపకపోవటంచేతనైనా వారిని రాజీనామాయిమ్మని అతివాదులు కోరియుండవచ్చును. కాని గవర్నమెంటు విధానములో మార్పు ఉండదట. దూరప్రాచ్యంలో రష్యాపై దాడి చేయమని జర్మనీ జపాన్ని ఒత్తిడి చేస్తున్నదనడానికి సందేహంలేదు. అందుకు ప్రోత్సాహంగ జపాను ప్రతిష్ఠించిన నాంకింగు బొమ్మప్రభుత్వాన్ని చీనా ప్రభుత్వంగా జర్మనీయు దాని బానిస రాజ్యాలును గుర్తించినవి. కాని రష్యాపై దాడి చేయడం జపానుకి సులభమా? మొదటి కష్టం ఏమంటే నాలుగేళ్లు ఘోరయుద్ధం సాగించినా చీనా లొంగలేదు. జపాను దానితోనే విసిగిపోయింది. రెండోది, రష్యా తూర్పు సరిహద్దు రక్షణ యేర్పాటులకు, పడమర సరిహద్దు రక్షణకు ఎట్టి సంబంధంలేదు. దేనికదే స్వయం సమృద్ధగనున్నందున జపాను దాడివలన రష్యాకు పోరాడే శక్తి తగ్గిపోదు.

ఇక జపాను ఒడంబడికల సంగతి చూద్దాం. ఇటలీ-జర్మనీలతో గావించుకున్న త్రిరాజ్యపు ఒడంబడిక ప్రకారం గూడ రష్యాకు ప్రతికూలంగా అక్ష రాజ్యాలకు జపాను తోడ్పడవలసిన అవసరంలేదు. ఆ ఒడంబడికనుండి రష్యా మినహాయించబడింది. పైగా రష్యాతో నిరుడే, బహుశ జర్మనీ ఒత్తిడివలన, జపాను నిరాక్రమణ ఒడంబడిక గావించుకొంది. దీని ప్రకారం రష్యా ఎవరితో యుద్ధంలోకి దిగినా జపాను తటస్థంగా ఉండాలి. ఈ షరతును జపాను పాటిస్తుందా?

జర్మనీ రష్యా శత్రుత్వం మొదలవగానే జపాను పత్రికలు హిట్లరు చర్యను తీవ్రంగా విమర్శించేయి. కాని సాధారణంగా జపాను ప్రజలు పత్రికలు బ్రిటిషు, అమెరికాలకు ప్రతికూలంగా ఉంటాయి. ఇపుడు రష్యాకు యీ రెండు దేశాలు సహాయం చేస్తామనడం జపానుకి కంట్లో కారం చల్లినట్లుంది.

కావున దేశంలో జర్మనీచర్యను సహించక దానివలన చివరకు జపాను బానిసరాజ్యమగునని తలంచే తెగయొకటుందనీ, పడమటి ప్రజాప్రభుత్వాలపై తీవ్రచర్య గైకొనాలను రెండో అతివాదవర్గం వొకటుందనీ తెలుసుకోవచ్చు.

ఈ రెండో అతివాదవర్గం పలుకుబడి, ఎక్కువై రషియా-యుద్ధం విషయంలో మంత్రివర్గమునందు యేకీభావం కుదరక కొనాయి ప్రధాని మంత్రివర్గం 16 వ తేదిన రాజీనామా నిచ్చెను.

### జపానేమి చేస్తున్నది?

గత కొద్దివారాలలో జపాను ఏమిచేసింది? ఫార్మోసా, హైనాను, దక్షిణ చీనాలందు జపాను సేనలను దించియుంచింది. ఇండో-చీనాయందు కొన్ని ప్రధానహక్కులు సంపాదించింది. విమాన నౌకాదళ కేంద్రాలను అచటను, థాయిలాండులోను ఏర్పరుచుకొంటుంది. ఇవి రెండువిధాల ఉపయోగపడతాయి. జర్మనీ రష్యాను ఓడిస్తే రక్షణగా ఉంటాయి, లేదా తాను దక్షిణానికి దాడివెడలినా ఉపయోగిస్తాయి.

ఈ పనులెందుకు చేసింది? ఎవ్వరికీ తెలియదు. జపాను రష్యాపై దాడివెడలితే రష్యా, ఇంగ్లాండు, అమెరికాలను మూడింటిని ఎదుర్కోవాలి. జర్మనీ గెలిచిందంటే జపాను జర్మనీక్రింద తొత్తుగా ఇపుడు ఇటలీవలె నుండవలెను. దూరప్రాచ్యంలో నూతన వ్యవస్థ స్థాపించే జపాను కలలన్నీ కలలుగానే ఉంటాయి. అట్లాకాక జపాను జర్మనీ మాయలో పడక తటస్థంగా ఉంటేకూడా, పశిఫికు ప్రాంతాల బలంగల అమెరికా ఇంగ్లాండు రాజ్యాలతో సఖ్యతగ ఉండాలి. ప్రజాప్రభుత్వాలతో సఖ్యత ఒడంబడికలంటే తన దక్షిణ దాడి మానుకొని, చీనాయుద్ధం నిలిపివేయాలి. ఇపుడు జపానులో అధికారంలోవున్న సైనిక నౌకాదళోద్యోగుల కూటానికి యిది యిష్టం ఉండదు. జపానుకుందేమి చేయునో చెప్పజాలం.

అమెరికా, బ్రిటను, అమెరికా, ఈస్టు ఇండీసు చీనా దేశములు యుద్ధము నెదుర్కొనుటకు సిద్ధముగా నున్నవి. దూరప్రాంత్యముననున్న బ్రిటీషు సేనాని బ్రిటీషు సేనలు సిద్ధముగానున్నవని యిటీవల ప్రకటించాడు. పసిఫిక్ మహాసముద్రంలో అమెరికా దేశమునకు విస్తారమైన యుద్ధనావలున్నాయి.

# సిరియా యుద్ధం ముగియుట

## ఇంగ్లాండు ఫ్రాంసు ఒడంబడిక.

సిరియాలో ఫ్రాంసు హైకమిషనరగు జనరలు డెంట్జు గారు యుద్ధం ముగించాలని కోరుతు మిత్రమండలి కేంద్రస్థానానికి కబురు పంపేదు విషీ ప్రభుత్వం ఎంతో వెనుకముందాడి యీ పనికంగీకరించింది. సంధి ఒడంబడిక చరిత్రాత్మకమగు ఆక్రి నగరంలో త్వరగ సంతకములై కేంద్ర ప్రభుత్వములచే ఆమోదింపబడెను. బ్రిటిషు, విషీ, స్వతంత్ర ఫ్రెంచి ప్రతినిధులు అదివరకు బద్ధవైరులుగ నున్నవారు స్నేహభావంతో సమావేశమయి 22 షరతులుగల ఒడంబడిక మీద సంతకంచేసిరి. దీనిలో ఫ్రెంచిసైనికులకు యుద్ధ గౌరవము సంగబడెను సిరియాకు స్వాతంత్ర్యం ఒసంగబడింది. మిత్రమండలికి సైనిక ప్రాధాన్యతగల స్థానము లొసంగబడెను. మంగళవారంనాడు ఫ్రెంచిసేనలన్నీ కేంద్రీకరింపబడి స్వదేశాలకుపోవును. ఉద్యోగులు సిపాయిలు తమ తుపాకులు వెంట తీసుకపోవచ్చును. కాని మందుగుండు తీసుకపోరాదు. ఫిరంగులు, మోటారులు మున్నగునవి బ్రిటిషువారి వశమందుండును. ఇతర సామానులు నాశనంచేయబడును.

మిత్రమండలి సేనలు జూన్ 8 వ తేదీన సిరియాలో కాలుపెట్టినవి. 34 రోజులలో 60,000 చదరపు మైళ్లుగల దేశములోనికి చొచ్చుకపోయినవి. విషీ సేనలన్నింటి సహాయం ఉన్నప్పటికీ డెంట్జుసేనాని రాజీకిరావలసివచ్చెను. విషీసేనలకు సకాలమున రావలసిన సహాయం రాలేదు. మిత్రమండలి సేనలు అతివడిగా దాడి సలిపినవి. వాటికి విమానదళం నౌకాదళం సహాయంకూడ బాగా ఉండెను.

ఫలితం.—సంధి ఫలితమేమి? ఇండియాయొక్క దూరపు సరిహద్దులను, సిరియాయు యికముందు అక్షరాజ్యాల చర్యలకులోనుగావు. సిరియనులకు స్వాతంత్ర్యం వచ్చింది; జర్మనీయొక్క బహిష్కారానికి లోనుగారు. టర్కీకి తనతో స్నేహంగానున్న ఇంగ్లాండుతో నేలమార్గము సముద్ర మార్గములు తెరవబడ్డాయికదాయని సంతోషముగ నుండును. ఇకముందు అక్షరాజ్యాలు టర్కీపై ఒత్తిడి కలుగజేయావు.

## చర్చిలు ఉపన్యాసం.

లండను మునిసిపలు సంఘంవారు బ్రిటిషు మంత్రివర్గమునకు విందు చేసినపుడు చర్చిలు ప్రధాని ముఖ్యమగు ఉపన్యాసమొసంగెను. జర్మను విమానాల దాడిని లండను నివాసులు ఎంతధైర్యంగా ఎదుర్కొని కష్టాలు సహిస్తున్నారో చెప్పి కొనియాడిరి. కనికరించమని అతడు శత్రువులను కోరలేదు. "జర్మనులు మనకెంత చేస్తున్నారో వాళ్లకు మనమంతే చేస్తాము, అంతకన్న ఎక్కువే చేస్తాము. మీరెంత చెడుగు చేయగలరో చేయండి. మేమెంత శక్తిచూపగలమో అంతచూపుతాము. హిట్లరుతోగాని, అతని దుష్కార్యాలన్నీ చేస్తున్న అతని భల్లూకపుమూకతోగాని ఎటువంటి రాయబారాలు జరుపము, సంధి చేసుకోము." జర్మనీలోను, జర్మనీ ఆక్రమించిన దేశాలపై రాయలు విమానాలు చేయదలచిన పని గూర్చి యిలా చెప్పేరు: "నాజీ పరిపాలన మాచే పూర్తిగ తొలగింపబడు వరకును లేదా జర్మనీ ప్రజలచేతనే ఖండించబడువరకును, నెలనెలకు, ఏటేటా ఎక్కువ ఎక్కువగా విమానాల దాడి చేస్తుంటాం. మా కర్మాగారాలలో తయారగుచున్న బాంబరువిమానాలును అట్లాంటిక్ సముద్రం ఆవలనుండి దినదినాభివృద్ధిగ వస్తున్న బాంబరులును, అత్యంత బరువైన బాంబులను జర్మనులపై పడవేయగలవు. ప్రతి నెల మా బాంబుల సంఖ్య పెరుగుచుండును; విమానాలు మరీమరీ దూరంగా పోతూవుంటాయి. దినాలు సాగినకొద్దీ జర్మనీకి దాని సర్రాజ్యంగానుండు దౌర్భాగ్యంపట్టిన ఇటలీ దేశం బాకీకూడా తీర్చుకుంటాం."

యుద్ధం ప్రారంభమయినప్పటినుండి యింతవరకు జర్మనీ ఎన్ని బాంబులు ఇంగ్లాండుపై వేసిందో అందులో సగంవంతు బాంబులు గత కొలది వారాలలో ఇంగ్లాండు జర్మనీపై వేసిందని చర్చిలుగారు చెప్పిరి.

## రైళ్ల యుద్ధం.

ఇరాకులో ఒక రైళ్ల యుద్ధం జరిగింది. ఒక బ్రిటిషువిమానం బాస్రాకు 50 మైళ్ల దూరంలో బలవంతంగా దిగవలసివచ్చింది. దానిలో ఉండే ముఖ్యమయిన కాగితాలు తెచ్చుటకై ఒక పెద్ద ఉద్యోగియు, పదిమంది సిక్కు సైనికులును చిన్న రైలులో బాస్రానుండి పంపబడిరి. ఆ రైలులో ఇంజను ఇంకో పెట్టె మాత్రం గలవు. ఇంజనునడుపుట రాకపోయినా సైనికోద్యోగి ఒక రైలుపనివాని సహాయంతో నడిపించెను. ఒక స్టేషను చేరుసరికి ఆ రైల్వే లైనుపైనే యింకో రైలు ఎదురుగా వస్తూవుంది. దానికి ఇంజను రెండుపెట్టెలు కలవు. దానినిండ సైనికులు ఆయుధాలు గలవు. అది శత్రువులదని గుర్తించి, సిక్కులున్న ఇంజనును అతివడిగా వెనక్కి నడిపించేరు. కొంతదూరంపోయేక ఇంజనుయంత్రాలు వేడెక్కి నడమటుమానింది. దగ్గరనొక కాల్వవుంటే సిపాయిలంతా దిగి, దాని వంతెనక్రింద దాగొనిరి. రైలుపనివాడు ఎరజండా పుచ్చుకొని 100 గజాలదూరాన వస్తున్న శత్రువుల రైలుకెదురుగ పోయి, దాన్ని నిలపాలనీ, అది నిలవగానే సిక్కు సిపాయిలు దానిలో వారిని తుపాకులతో కాల్చాలనీ, శిక్కులు ఎత్తువేసిరి. కాని సాగలేదు. ఈ జండామనిషి ఇంజను చేరగానే, శత్రువులు వానినందులోకి దీసుకొని, రైలుని కాల్వపై వంతెనవరకు తెచ్చిరి. రైలులోనుండు వారు కాల్వలోనికీ, కాల్వలోనివారు రైలులోనివారిపైని తుపాకులు ప్రేల్చుకొనిరి. ఒకరికొకరు కనబడరు. రైలుముందుకు సాగి మరల వెనుకకు వచ్చెను. మరల తుపాకులు ప్రేల్చిరి. ఈ రీతిగా శత్రువులరైలు ఆ కాల్వపైకి మూడు మారులు వచ్చిపోతూవుండెను. ఇంజను నడుపుతున్నది మన రైలు ఉద్యోగేనని అపుడు తెలిసెను. అతడు మొదట ఇంజనులోకి పోగానే దాన్ని నడపుచున్నవానిని పడగొట్టి, తానేనడపుచుండెను. వెనుక పెట్టెలోనున్న శత్రువులను సిక్కు సిపాయిలు కాల్చి చంపుటకు అవకాశముండుటకై వంతెనపైకి మూడు సారులు బండిని తెచ్చెను. శిక్కులావిషయం గమనించి ఇంజనులోకి తెలియకుండా ప్రవేశించి, ముందున్న తమ రైలును త్రోసుకొనుచు బాస్రావైపు పోయిరి. దారిపొడుగునా రైలుబండిలో యుద్ధం సాగిస్తూ వచ్చేరు. దారిలోవున్న స్టేషను ప్లాటుఫారంపై చాలమంది ప్రజలు చేరియుండిరి. కాని రెండు గుండ్లు ప్రేల్చేసరికి పారిపోయిరి. రైలు బాస్రా చేరింది. శత్రువుల ఆయుధాల రైలును సిక్కు సిపాయిలు వశపరచుకొన్నారు. కాని బండిలోని శత్రువులు దారిలో చల్లగా జారిపోయినారు.

---

సలహా: ఇకముందు చూచుకొనుటకు యీ మదరాసు యుద్ధ సంచికను మీరు భద్రపరచుకొనుడు.

[మదరాసు సమాచారముల డైరెక్టరుగారు తమ వందనములతో దీనిని మీకు పంపుచున్నారు.]

MADRAS : PRINTED BY THE SUPERINTENDENT, GOVERNMENT PRESS.